## మొగులైంది

నందిని సిధారెడ్డి

దర్భశయనం శ్రీనివాసాచార్య

జూకంటి జగన్నాథం

పప్పుల రాజిరెడ్డి

అలాజిపూర్ కిషన్

దేశపతి శ్రీనివాస్

తైదల అంజయ్య

ఐలేని గిరి

వేముగంటి మురళీకృష్ణ

కె. రంగాచారి

పోగుల రాజన్న

# మొగులైంది



మంజీరా రచయితల సంఘం

నిర్వహించిన

సామ్రాజ్యవాద వ్యతిరేక కవి సమ్మేళనం

కవితలు

# మొగులైంది

**MOGULINDI**
Poems against Imperialism

by **MANJIRA RACHAYITHALA SANGAM**

1996 JULY

Title : PRABHU, Siddipet.

Rs. **5/-**

ప్రతులకు :

'దిశ' పుస్తక కేంద్రం, చిక్కడ పల్లి, హైదరాబాద్,
నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్,
మంజీరా చయితల సంఘం, 11-2-47/3, భారత్‌నగర్, సిద్ధిపేట - 502 103.

---

ముద్రణ : చరిత గ్రాఫిక్స్ - ఆఫ్‌సెట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20.

సామ్రాజ్య వాదుల
గుండెల్లో నిదురించిన
కెన్‌సరోవివా కి

# సరకుగా మారిన సంస్కృతి

– కె.ఎన్. ఫణిక్కర్

భారతదేశంలో ప్రస్తుతం ఉనికిలో ఉన్న లౌకికభావం, దాని చారిత్రక అనుభవం నుండి పరిణామం చెందింది. పలురకాల ఆధారాల నుండి రూపుదిద్దుకున్నది. స్వభావరీత్యా అది విభిన్నమైనది. వ్యక్తీకరణ రీత్యా బహుళమైనది. భిన్నత్వాన్ని అంగీకరించే సామాజిక, సాంస్కృతిక ఆధారాలు, ప్రవర్తన ఈ లక్షణాలను ప్రతిబింబిస్తాయి. పెట్టుబడిదారీ పాశ్చాత్య ప్రపంచం మాదిరిగా ఇక్కడ ప్రామాణీకరణ వుండదు. ఆహారం కానివ్వండి. వేషబాషలు కానివ్వండి. వినోదం కానివ్వండి. దాదాపు నిత్య జీవితంలో ప్రతి అంశంలోను శక్తివంతమైన సంస్కృతికి చెందిన విలువైన వారసత్వం కనిపిస్తుంది. ప్రపంచశక్తులచే రూపకల్పన చేయబడిన నూతన సాంస్కృతిక, మౌలిక స్వరూపం దేశీయ లౌకికజ్ఞానాన్ని విస్మరిస్తుంది. లేదా అది కాలం చెల్లిందని చెబుతుంది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ విధానపు లౌకికజ్ఞానాన్ని ఆ స్థానంలో నింపాలని చూస్తుంది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ విధానపు ఉత్పత్తులతో ఆ లౌకికజ్ఞానపు విశేషాధికారాలు, ఆచారాలు, ప్రవర్తన ముడివడి వుంటాయి. అభివృద్ధి చెందిన పెట్టబడీదారీ విధానపు లౌకికభావం సార్వజనీనమైనదని చెబుతారు. ప్రపంచీకరణవల్ల సార్వజనీన సంస్కృతిని అంతరంగికం చేయడానికి వీలు కల్గుతుందని వాదిస్తున్నారు. ఒక ముక్కలో చెప్పాలంటే ఇది ఆధిపత్య ప్రయోజనాలను కప్పి పెట్టుకోవడానికి అనువైన సాకు మాత్రమే

ప్రపంచ శక్తులు ప్రస్తుతం భారతదేశంలో నిర్మిస్తున్న సాంస్కృతిక మౌలిక స్వరూపం ఈ “సార్వజనీన” సంస్కృతిని అంతరంగికం చేయడానికి మార్గాన్ని సుగమం చేస్తుంది. బూర్జువా వర్గం చురుగకుగా మిలాఖత్ అవడం వల్ల ఇది సాధ్యపడుతుంది. వీరు ఆధిపత్య సంస్కృతికి చెందిన విలువలను, అభిరుచులను ప్రచారం చేయడమే కాకుండా వాటిని చట్టబద్ధం చేయడానికి కూడా కృషిచేస్తారు. ఈ విధంగ ఆ భారతీయ మధ్య తరగతి వర్గ వలసపాలనలో వారి సాంస్కృతిక పరివర్తన, పాశ్చాత్య ప్రపంచం అందించే వాటికి ఆహ్వానం పలికింది. తమ ఊహాజనిత భవిష్యత్ వైపుకు పయనించడానికి అవసరమైన అవకాశాన్నివ్వని స్వాతంత్ర్యం వారిని అసంతృప్తికి గురిచేసింది. వారు ఎదురుచూస్తున్న అవకాశం ప్రపంచీకరణ ద్వారా లభించింది. వారు “సార్వజనీన” సంస్కృతికి ఆహ్వానం పలకడమే కాకుండా, దాని ప్రచారానికి సాధనాలుగా కూడా తయారయ్యారు.

స్వేచ్ఛా అవకాశాలు మన సమాజానికి నూతన మార్గాన్ని చూపుతున్నాయని బూర్జువా వర్గం, మధ్య తరగతి వర్గం చెబుతోంది. గాంధీజీ చెప్పినట్లు కిటికీలు తెరిచి వుంచడం అవసరం. మనం ఆ గాలికి కొట్టుకుపోకుండా చూసుకోవడం కూడా అంతే అవసరం. మనకు ఇష్టం లేకపోతే కిటికీలు మూసివేసుకునే అవకాశం ఇప్పుడు మనకు

లేదు. సాంస్కృతిక సంబంధాలు, బలాబలాల తేడాలు, ఆర్థిక అసమానతల ఆధారంగా సాంస్కృతిక ఆధిపత్యం నేటి వాస్తవం. సంస్కృతి అనేది తటస్థమైనదనీ, ప్రపంచశక్తులు ప్రత్యక్ష రాజకీయ పెత్తనాన్ని సాగించడం లేదని భావించినప్పటికీ స్వేచ్ఛాపూరిత అవకాశాలు అన్నది ఒక భ్రమ మాత్రమే. దేశీయ సంస్కృతి ఆచారాలను తృణీకరించడం అనేది ఒక అనివార్యమైన ఫలితం. ఎలక్ట్రానిక్ మాధ్యమం వేగంగా చొరబడుతూ సాంస్కృతిక దాడి చేస్తున్నది. ఈ విధంగా ప్రపంచశక్తులు ఒక నూతన సాంస్కృతిక అంశాన్ని మాత్రమే ప్రవేశ పెడుతున్నాయన్న భావాన్ని కలుగజేస్తాయి. అందువల్ల శతృత్వం అనేది భారతీయ విలువలకు వ్యతిరేకమైన "నూతన" సంస్కృతికి మాత్రమే పరిమితమవుతుంది. కాని ఇది తప్పుదోవ పట్టించేది. ఎందువల్లనంటే ప్రపంచశక్తులు దేశీయ సాంస్కృతిక రూపాలను, ఆచారాలను స్వంతం చేసుకొని భారతీయ ముసుగులో పనిచేస్తున్నాయి.

ఈ స్వంతం చేసుకోడానికి రెండు కోణాలున్నాయి. నిర్మాణం సరకుగా రూపొందించడం. గత కొంతకాలంగా పలు ప్రపంచసంస్థలు సంస్కృతికి సంబంధించిన వివిధ అధ్యయనాల కోసం పెద్ద ఎత్తున పెట్టబడులు పెట్టాయి. జనాదరణ పొందిన సాంస్కృతిక రూపాలకు, ప్రజలకు పరిచయం లేని అర్థాలను కల్పిస్తున్నాయి. ఇది అంతిమంగా వలసవాదానికి ఉపయోగపడిన ప్రాచ్య విజ్ఞాన వాదాన్ని గుర్తుకు తెస్తున్నది. అదేవిధంగా నిర్మాణ వ్యతిరేకులు, ఆధునిక అవాంతర వాదులు సంస్కృతిని సందర్భరహితం చేసేందుకు, చారిత్రకత నుండి వేరు చేసేందుకు చేసే ప్రయత్నాలు సాంస్కృతిక సామ్రాజ్యవాదుల ఆధిపత్యానికే దోహదపడుతున్నాయి. సంస్కృతిని, దాని మూలం నుండి వేరుచేసే నూతన స్వరూపాలు, దాని జీవబంధాన్ని త్రుంచివేస్తున్నాయి. ఆ రకంగా ప్రపంచశక్తులు పనిచేయడానికి చోటు కల్పిస్తున్నాయి.

దేశీయ సంస్కృతిని స్వంతం చేసుకోవడం, దానిని సరకుగా మార్చడం అనేవి ఒకే నాణానికి రెండు పార్శ్వాలలాంటివి. ఈ సాంస్కృతిక కార్యకర్తలు జనసంస్కృతిలోకి నిదానంగా ప్రవేశిస్తున్నారు. తమ ప్రేక్షకుల సాంస్కృతిక ఆసక్తిని, వారి ఆధిపత్య స్వభావాన్ని సంతృప్తిపరిచేందుకు వారు దానిని ప్రపంచ మాధ్యమాల సరకుగా తయారు చేస్తున్నారు. గిరిజనుల నృత్యాలు, రైతుల పాటలు, గ్రామీణుల యుద్ధక్రీడలు, ఇంకా అనేక ఇతర కళారూపాలు సందర్భరహితంగా స్టూడియోలలో ప్రదర్శించబడుతున్నాయి. ఉన్మాదపూరితమైన, ఆదిమ కళారూపాలుగా చిత్రించబడుతున్నాయి. తమ అసలైన రూపాన్ని, సారాన్ని సందర్భాన్ని కోల్పోతాయి. ఎలక్ట్రానిక్ మాధ్యమాలు పెచ్చు పెరిగిపోవడంతో సంస్కృతిని సజీవమైన రీతిలో చిత్రించేస్థానంలో కృత్రిమమైన చిత్రణ వస్తుంది. ఈ కళారూపాలు పుట్టిన దేశాలకు దీనివల్ల జరిగేనష్టం ఆ కళారూపాలు సృజనాత్మక శక్తిని కోల్పోవడం, వారి సామాజిక జీవనంతో సంబంధంలేని సంస్కృతి ఏర్పడుతుంది. అంటే విచారకరమైన అంశమేమంటే ప్రజలసంస్కృతి ప్రచారసంస్కృతిగా మార్చబడుతుంది. సంస్కృతిని అవశేషంగా మార్చే ఈ క్రమాన్ని నిరోధించాలి.



# నిద్రలేవాలి

– నందిని సిధారెడ్డి

కొల్లగొట్టటమే స్వభావమయిన ముఖయంత్రానికి
శరీరమయితేనేమి ? మనసయితేనేమి
ఊయలలో ఉంచి ఊపుతున్నప్పుడు
లోకమంతా ఊగుతున్నట్టే ఉంటుంది
పొందుతున్నదేమిటో
కోల్పోతున్నదేమిటో
పున్నమి చంద్రునితో ఆడి ఏటి అలల్లోంచి ఎగిరిపడిన
చేపపిల్లకు తెలియదు
ప్రపంచీకరణలో పసివాడికీ పౌరునికీ అంత తేడా అనిపించదు
మారింది శరీరమా అనుభవమా అర్థంకాదు
పసివాడి నోట్లో నిప్పల్ పెడితే
మెలకువున్నంత సేపూ పాలొస్తున్నాయనే పరవశం
సబ్సిడీ పథకాలు మట్టకు రాస్తే చాలు - మందీ అదే పరవశం
మనది నిద్రో మెలకువో ఎవరు చెప్పాలి
పశుసంతతి మార్చి
పంటచేలు మార్చి
పాలలో పాలదనమంతా తరలించారు
పాలసముద్రంలో పడుకొని
భూమిని రాజకీయం చేశాడు వాడు
చమురు సముద్రంలో పడుకొని
మనిషి తనాన్ని
మహా రాజకీయం చేస్తున్నాడు వీడు
అర్థాలు మార్చదలుచుకున్నవాడికి
జనం భాషేమిటి ? కావ్య భాషేమిటి ?
సున్నితమైన అనుభవాలన్ని

డబ్బుకట్టల కింద విలవిల్లాడి మూర్ఛపోవటం మామూలైంది
కాలికి గజ్జెకట్టి ఆడటం
పెద్ద అనుభవమేమీ కాదు
కాలికి  రూపాయి బిళ్లలు కట్టి ఆడటమే
ఇప్పటి నాట్యం

చరిత్ర కాదు -
వాణిజ్య ప్రకటనలు
మనకు జీవించడమెట్లాగో నేర్పుతాయి
మనపిల్లల్ని మనమెట్లా ప్రేమించాలో
మల్టీనేషనల్ కంపనీలు చెబుతాయి
ఆడ పిల్లల్ని ఏ వయసులో ఎట్లా వేధించాలో
హాలివుడ్ చక్రవర్తులు చెబుతారు
మనుషుల మీది ప్రేమలు వస్తువుల మీదికి మార్చిన వాన్నేమనాలి ?

ఒక్కసారిగా విషమిచ్చినందుకు సోక్రటీస్ అదృష్టవంతుడే అనుకోవాలి
ఆఫీసులో కొంత అంగట్లో కొంత
సినిమాల్లో కొంత విషం విదిలిస్తే చావూ ఒక్కసారి రాదు
ఆత్మహత్య నేరం కావొచ్చు
ఇంట్లో టీవీ సముద్రం నురుగుల్లో
మనల్నిమనం చంపుకోవటానికి వాయిదాల పద్ధతి నేరం కాదు
వేసవికాలం  వాటర్ ట్యాంకు పగ్గెల్లోంచి
ప్రపంచ బ్యాంకు పొడవాటి బిరుదులు చాస్తుంది
మన బిందెలో నిండినవి
నీళ్లో రసాయనాలో తేల్చుకోవటం ఇక వీలుపడదు
ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లో వొట్టిపోతున్నది
దేహమో దేశమో ఎవరు గుర్తించాలి



హడావుడిగా నువ్వు నడుస్తున్నప్పుడు
నీకాళ్లకింది పచ్చిక బయలు నిన్ను చూసి నవ్వుతుంది
ప్రియురాలి మీద ప్రేమ మోసుకెళ్తున్న
నీ చేతిలోని మల్లె పూల పొట్లం నీ లెక్కలు చూసి నిట్టూరుస్తుంది
ఇయర్ ఫోన్ మ్యూజిక్ కేకలకి
తప్పిపోయిన కోకిల వెక్కిరిస్తుంది
తప్పిపోయింది
కోకిలో మన అనుభవాలో అర్థం చేసుకోవటం కష్టం
తప్పించిన అనుభవాల్ని వెదికి పట్టుకోవటానికి
తలకిందులైన ఆరాటాల్ని సవరిచ్చుకోవటాన్కి
మనశరీరంలో మనం నిద్రలేవాలి
మనగోదావరిలో మనమే ఈదాలి

# ఛానెల్స్

– దర్భశయనం శ్రీనివాసాచార్య

ఏ లోగిలిలో ఎన్ని పచ్చని పతాకాలున్నాయో
ఏ కొమ్మ ఏ పాటనెత్తుకుంటున్నదో
ఏ రాగం ఏ చిగుళ్ళను తలపిస్తున్నదో
ఇవాళ కదిలించొద్దు అది పురాతన ప్రస్తావన
అవుటాఫ్ డేట్ ఆలాపన
పాతకాలంలో మాగిన వయసు మళ్ళిన పరామర్శ

ఇంటికిరీటమై నిల్చిన ఏంటెన్నా
ఎన్ని ఛానెల్స్‌ని ప్రసరిస్తున్నదో
ఏయే వేళల్లో ఎన్నెన్ని విన్యాసాల్ని విప్పుతుందో
తెలియడమూ మాట్లాడ్డమూ ఇవాల్టి శైలి
అప్‌టుడేట్ కల్చర్
వర్తమానంలో బతుకుతున్నట్లు ఋజువు చేసే
దాఖలా –

ఇపుడు మట్టిని గురించో
మట్టిలో మాగిన శతాబ్దాల సారాంశం గురించో
మాట్లాడొద్దు
మట్టి కోసమై మట్టిలో కల్సిన రక్తాన్ని
ఇపుడు వెలికి తీయొద్దు
ఏ పాత పాటనూ ఇవాళ విడుదల చేయొద్దు

ఇది కొత్త పాటల కాలం
నేల మీద కాళ్ళానని నృత్యాల కాలం
ఏస్క్రీనింగూ లేని అనాచ్ఛాదిత విహారాల
కవాతులు కదులుతున్న కాలం



స్విచ్ ఆన్ చేయడమే తరువాయి
అన్ని ఛానెల్సూ బతుకుల్లోకి దూసుకొచ్చి
నేలనుంచి ఎత్తి వేస్తాయి
అర్థ సంబద్ధతా కాల సంబద్ధతా నేల సంబద్ధతా
ఏదీ అక్కర్లేదు
బతుకు మొదటి అడుగులోని పసివాడో
ఆఖరి అడుగులోని ముసలివాడో
వయసు తరంగాల మీది కుర్రాడో
ఇంటి మనిషో ఆఫీసు మనిషో
మినహాయింపుల్లేవు
అందర్లోకీ ఛానెల్స్ ఛానెల్స్
ఇంటినిండా ఛానెల్స్ ఛానెల్స్

ఇపుడు నీతి సూత్రాల్నీ మంచీ మర్యాదల్నీ
కళాత్మక మూల్యాల్నీ జాతి మూలాల్నీ
సహజాతి సహజ మానవ అంతస్సూత్రాల్నీ
ప్రస్తావనకైనా తలవొద్దు
నోళ్ళకు కుట్లేసుకుని ఛానెల్స్ ముందు వాలి
మోకరిల్లాల్సిందే
కళ్ళల్లోకో చెవుల్లోకో చేరి ఛానెల్స్
అంతలోనే అంతరించవు
రక్తరహదారుల్ని చేరి బతుకు సమస్తంలోకి
దిగబడతాయి
ఆఖరికి స్వప్నవాటికలో బీజాలై పాతుకుంటాయి
ఇక మనుషులు మట్టిని కాదు ఛానెల్స్ విన్యాసాల్నే
స్వప్నిస్తారు కళ్ళు మూసీ తెరిచీ –
అన్ని వికృత ఆకర్షణల నడుమ
జీవితంలోంచి సొంతదనం ఇగిరిపోతుంది

కాళ్ళకూ నేలకూ నడుమ వేళ్ళు
పుటుక్కున తెగిపోతాయి
ఇక నేల మాటేముంది
నేల్లో మాగిన చరిత్రతో మన అన్వయమేముంది

ఇపుడు ఆమె ఆమెలోనూ
అతను అతనిలోనూ నువ్వునీలోనూ
నేను నాలోనూ పల్లె తన పల్లెలోనూ
దేశం తన దేశంలోనూ శ్వాసిస్తున్నట్లేనా

ఏది మన అయువు పట్టు
ఎక్కడ మన సొంత గొంతు
ఎపుడు మరిచాం ఎలా మన నేల పాట
మన పచ్చని పతాకాల్లో మన కోయిలల్ని
మళ్ళీ ఎట్లా గుర్తుపట్టేది

పరాయితనాన్ని బట్వాడా చేస్తున్న
ఛానెల్స్‌ని ధ్వంసించకుండా
మనల్ని మనం చేరేదెట్లా
మనకు మాటనిచ్చిన మట్టికి దగ్గరయ్యేదెట్లా



# బహు రూపాలు

- తైదల అంజయ్య

శరీరమంతా రూపాయిమందు పట్టించుకున్నాక
ఏ విలువలైనా రూపాయిల్లోకే మారుతాయి
మనింటి టీవీలో చేపలు తినని తెల్లకొంగ
చెరువు గట్టుమీద కూర్చుంటుంది

నేను చిన్నప్పుడు
చేపపిల్ల చందమామలా వుందనే వాన్ని
కానీ మా చిన్నోడు మాత్రం
రూపాయి బిళ్ళలా మెరుస్తోందంటున్నాడు !
ఇదేమిటీ ! నా చేతిలో రూపాయి
గోళాకారంగా మారిపోతోంది

ఇక్కడి గోడమీది వ్యాపార ప్రకటన
ధాన్యపు బస్తాలోంచి
రూపాయి నాణాల్ని కుమ్మరిస్తోంది
గుండె కూడా ఏ స్పందనా లేకుండా
ఖచ్చితంగా యంత్రం లాగే కొట్టుకుంటోంది
రంగులను ఎరజూపి మత్స్యన్యాయం
ఛానళ్ల నిషాల్లో జోగుతోంది
పల్లెల అరుగుల మీద బీడీలు చేసే
మట్టి చూపులు దూరతారలను దర్శిస్తాయి

చేసే శ్రమ దోయబడడంతో పాటూ
శ్రమించే శక్తీ హరింపబడడం !
కౌబాయ్ గన్‌షాట్‌కు
రెండు చేతుల కష్టం
రక్తంలో కొట్టుకుంటున్న పిట్టలా తల్లడిస్తుంది

మన తలల్ని చతురస్రాలుగా చేసి
నరాలను ఛానల్స్‌గా మార్చి పట్టపగలు కలల్లోకి నడిపిస్తున్నాడు
హిరణ్యకశిపుడి చెవికుండలాన్ని
రావణుడు మోయనిది నిజమో కాదో గానీ
నిజంగానే మన తాతల ముంజేతి కడియాల్ని
మనం మోయడం లేదు
మన మధ్య రహస్యంగా సంచరిస్తూ
మనల్ని అన్ని విధాలా క్షయీకరించే
రూపాయి ముఖాన్ని ఎక్కడా చెల్లకుండా చేద్దాం

మన బలహీనతలన్నీ
వాడి రిమోట్ కంట్రోలర్‌గా మారకముందే
మన కాళ్లకింద విస్తరిస్తున్న స్లోపాయిజన్‌ని
ఎక్కడికక్కడే తొక్కేస్తే !



# కుట్ర

– జూకంటి జగన్నాథం

యుద్ధం జరుగుతూ ఉంటుంది
శతృత్వం ఎక్కడా కనిపించదు
యుద్ధం కొనసాగుతూ ఉంటుంది
ఆయుధం నీడలు ఎక్కడా అగుపించవు

నిరంతరంగా నీ నా చాపకింద
నీరు ప్రవహిస్తూ ఉంటుంది
అప్రతిహతంగా
తడిగుడ్డతో గొంతులు నులిమి వేయబడుతుంటాయి
చూస్తూ చూస్తుండగానే
కళ్ళతో నవ్వుతూ గుండెల్లో
కత్తులు దించబడుతుంటాయి
కళ్లు మూసి తెరిచేంతలోనే
పైదొంతర పైనుండగానే
కింది దొంతర కిందుండగానే
మధ్య దొంతర మాయమైపోతుంటుంది

కనుగుడ్లు చూస్తుండగానే
సునాయాసంగా చూపు కబళించబడుతుంది
మనిషినుంచి మానవీయతను వేరు చేయడం
పనినుంచి, పనిలేని తనాన్ని 'కంప్యూటరైజ్డ్' చేయడం
కేవలం ఒకే ఒక్క 'రిమోట్ కంట్రోల్' తో
భూమ్యాకాశాల్ని ఆక్రమించి
నడినెత్తి మీద కాలుపెట్టడం
మనం అధఃపాతాళంలోకి కూరుకుపోతుంటాం
ప్రమాదం గ్రహించే సరికి

మెడవరకు ఉచ్చు బిగించబడుతుంది
ఒక్క డిష్ కనెక్షన్ టెలివిజన్ చాలు
బలవంతం లేకుండానే లొంగిపోతాం
సమ్మతి పత్రంపై నిశాని వేసేస్తాం
ఒకే ఒక్క ప్రకటన చాలు
వస్తువు సముచ్చయాన్ని పొందడానికి
గిలగిల్లాడి పోతుంటాం

మెదడు పనిచేయడం మాని వేస్తుంది
గుడ్లప్పగించి చూస్తూ వుంటాం
దుర్మార్గంగా దారుణాలు జరిగినా
ప్రమాదాలు జరిగినా
అతి సహజంగా మొద్దుబారిపోతుంటాం

యుద్ధం జరుగుతూ ఉంటుంది
కానీ, ఆయుధం ఎక్కడా కనిపించదు
యుద్ధం కొనసాగుతూ ఉంటుంది
కానీ, చేతులకు ఎక్కడా రక్తం అంటదు



# ఒక గాలివాన కోసం

– దేశపతి శ్రీనివాస్

మనకు తెలియకుండానే
మనం సీసాల్లోకి ఒదిగిపోతుంటాం
బిరడాబిగించి, లేబిల్ అంటించి
భూస్థాపితం చేయబడతాం
ఇప్పుడు మన మేథస్సంతా
జీహుజూర్ అంటున్న జిన్నీభూతం
దేశ దేశాల పచ్చదనం అంతా
వాడి కుండీలో బంధించబడ్డ బోన్‌సాయ్‌చెట్టు
మన చుట్టూ - పిట్టా - గొడ్డూ గోద
వైట్‌హౌస్ గోడల మీద దిగ్గొట్టబడ్డ పెయింటింగ్
బల్లినాలుక విసిరినంత సులువుగా
లైట్‌హౌస్ పెట్టుబడిని విసురుతుంది
కాగితం పులి చల్లని మంచుకోరదిగిన మనకళ్ళు
అదృశ్య ఆయుధాల్ని పోల్చుకోలేవు
మనదైన దాని మీంచి
ఒక అదృశ్య షెర్మన్‌టాంక్ నడచిపోతుంది
మనుషుల పిప్పి
వాడి సాంచెల్లో ఆకారం దాలుస్తుంది
ముఖాల్ కడగటం
స్నానాల్ చెయ్యటం
పిల్లల్ని లాలించటం
అంతా వాని రిమోట్ కంట్రోలింగ్‌లోనే
మననీళ్ళని మనం తాగటం మరచిపోయి
మన ధాన్యం మనం తినటం మరచిపోయి
మన విత్తనాల్ని మనం మొలకెత్తించటం మరిచిపోయి

వానిసీసాల మినరల్ నీళ్ళనీ
వాని వంగడాల విషపురాళ్ళనీ
వాని ప్యాకెట్లలో జీవం రాల్చుకున్న పాలపొడినీ
ఆశగా చూస్తుంటాం
మన అస్తిపంజరాల్ని
అంటెన్నాలుగా ఎగురవేసి
శాటిలైట్ లింకుతో
నీళ్ళకు బదులు కోకాకోలాలు ప్రవహిస్తున్న ఎడారిలో
న్యూయియర్ సెలబ్రేట్ చేసుకుంటాం
జీవితం ఏక్‌తారా తీగ తెగి
పక్షవాత రోగిలా కొంకర్లు తిరిగి
మైఖేల్ జాన్సన్‌నృత్య భంగిమలోకి మారుతుంది
పాప్‌మ్యూజిక్ జాజ్‌డ్రమ్‌లో
హంటర్‌జెట్ విమానపు శృతి మనం పసిగట్టలేం
సూది ఆనకుండా
రక్తం సిరంజిలోకి తోడబడుతుంటే
ఆక్రమణ ఆర్థిక సరళీకరణగా పేరుమార్చుకుంటే
డాలర్ ముందురూపాయి గొంతు పిసుక్కుంటుంటే
'షేర్ ద మ్యాజిక్' అని
కాగితం పులి చప్పట్లు చరుస్తుంది
విప్లవం అంటే
ఉరితీయబడ్డ శిరస్సనీ
భూమిని కావలించుకున్న త్యాగాల రక్తమేఘమనీ
మనం పాడుతున్నప్పుడు
విప్లవం అంటే
హైబ్రీడ్ గొడ్డి గేదనీ
కుక్క గొడుగుల పంటనీ



ఒనీడా భూతం నెత్తిమీద మొలచిన కొమ్మనీ
ప్రచారం చేస్తుంది
భాషని పాదాలు నాకే బుల్‌డాగ్‌లా మొరగమంటుంది
చిక్కి ఎముకలు తేలిన దేశాలకి స్లిమ్‌నెస్‌కి పోటీలుపెట్టి
ప్రపంచసుందరి కిరీటాలు పెడుతుంది
ప్రపంచకుగ్రామంలో
దేశాల్ని వెట్టిబానిసల్ని చేసుకుంటుంది
ఊపిరి సలపని ఇంత హోరులోనూ
ఉరితీయ బడ్డ కంఠం నీలినరాల పాట
జనం కళ్ళకింద దివిటీల్ని మండిస్తుంది
వియత్నాం వెదురు వేణువులలోంచి వీస్తున్న గాలి
ఊపిరిలో ఊపిరులూదుతుంది
కాగితంపులి ఎగిరిపోయే గాలివానకోసం
మూడో ప్రపంచం మేఘావృతమవుతుంది

# బువ్వలేని తలె

– వేముగంటి మురళీ కృష్ణ

చేతుల్లోంచి బువ్వజారిపోతున్న కల
వెనక వెనక నడిచొచ్చే
ఆవులగిట్టల చప్పుడు
ఆగిపోయిన నిశ్శబ్దం

నెత్తిన తలపాగా
ఊరు
పంచాయతీ బండ
పిల్ల ఈతల కేరింతల దిగుడుబాయి
అన్నీ మాయమయి
దిగులు బారిన దృశ్యం
మూలన పడుకున్న ముసలి తనంలా
పదును తగ్గిన నాగలి
గట్లమీద రెపరెపమనే చెట్లు
పల్లెపాటల్ని
గొంతులోకి వంపుకోటంలేదు

ఎవరో
పొట్టివంగడాలను
మనిషిరక్తంలో ముంచి
నాట్లేస్తున్నారు
రైతును
ముక్కలు ముక్కలుగా నరికి
పొలాలకు దిష్టిబొమ్మలుగా
వేళ్ళాడదీస్తున్నారు



చేతులకష్టం రంగుమార్చుకొని
క్యాప్టన్ కుక్ ఆటా
అవతారమెత్తితే
తలెల రొట్టెముక్క
అమాంతంగా తరుక్కుపోయిన బాధ

పొట్టనింపేవాడి పొట్టకొట్టడం
సరళీకృతమవుతున్న సన్నివేశం
పంటల్లో
పల్లేరుగాయలు పోసినవాడు
జనం రక్తం పీల్చి
లైట్‌హౌస్ గోడలకు
రక్తపు తెట్టెల్ని కడతాడు
వాడు కళ్ళకుగంతలుకట్టడు
రెండు డిస్ ఏంటినాలను
వెళ్ళాడదీస్తాడు
ఆకాశం ముక్క తెగి
సముద్రంలో కలిసిపోయినా
అలలు రెక్కలు కట్టుకొని
ఆకాశంలో వాలినా
చూడలేని
గుడ్డితనంలోకి నెట్టేస్తాడు
కొత్త చూపుకోసం
జీవితం కొట్టుకులాడుతున్నదిప్పుడు
శ్వేత సౌధాలను మట్టికరిపించేందుకు
రైతుపిడికిట్లో మట్టి జలదరిస్తున్నదిప్పుడు

# విషపు నీడ

– పప్పుల రాజిరెడ్డి

మసిబారిన విషపు పొగల సంస్కృతీ మేఘాలు
కురుస్తున్న సామ్రాజ్యపు ఆసిడ్ వానల్లో తడుస్తూ
తబ్బిబ్బవుతూ – తుళ్ళుతూ తేలిపోతూ బలైతున్న మనిషి మనుగడ
అగమ్యతీరాల వెంట కోర్కెల గుర్రమై మత్తుగా జఢత్వం ఆవరించి
ఆలోచన మందగించి భోగలాలసల సులభ సుఖాలకోసం వెర్రిగా పరిగెడ్తుంది
వేయి రూపాయలుగా అవతరించిన జిత్తులమారి పెనుభూతం వేళ్లూనుకొని
జడలు దాల్చి వ్యాపార రంగస్థలంపై సమాజం సర్వముఖాలపై
రంగు రంగుల సింగిడై మోహిస్తుంది
పత్రికల్లో పరువాలు వొలకబోసుకొని ప్రకటనల మసాల మత్తుతో
న్యూడ్‌గా తూలుతుంటుంది
నరాలకింది నీరసానికి పటుత్వపు సలహాఇ –
ఆడపిల్లలూహించుకొని ఆత్మహత్యించుకొనే సీరియల్ వలవుతుంది.
ఆబ్బోఎన్నెన్ని వికృత విశృంఖల వేషాలో
తల్చుకుంటేనే ఊపిరి ఉరకలేస్తుందేమో
మాట బానిసైతుందేమో
మనసు మారక ద్రవ్యాల బిళ్ళవుతుందేమో
ఆగాల్సిందే ఆలోచించాల్సిందే
మార్కెట్లో కెళదామా – ఏదో ఓహోమ్‌నీడైపోతావు
వివిధాకృతుల వికృత భంగిమల అలంకారాల అహంకారమై పోతావు
కాస్మటిక్ ప్రపంచం రంగుల కలై అమాంతం అలుముకుంటుంది
ఐస్‌క్రీమై ప్రవహిస్తుంటావు ఆనందడోలికా మాలికల కలల కౌగిళ్ళలో
కూడవెట్టిన డబ్బు – వక్రమార్గాల డబ్బు నల్లడబ్బు తెల్లడబ్బు షేర్‌మార్కెట్లో
తగలేసి –
లబ్‌డబ్‌మని కొట్టుకుంటుంటావు
'బ్రోచేవారెవరురా' బ్రోకరా, గాలం తగలదు చేప చిక్కదు



పేకమేడ కూలుతుంది తుపాన్ రేగుతుంది పిచ్చిముదురుతుంది
మార్గం దొరకదు మన్నోదుమ్మో చివరకు మరణమో ఏదో ఒకటి మిగుల్తుంది
సినిమాకెళ్ధామా వీడియోకెళదామా వి.సి.పి. పెట్టుకొని విహరిద్దామా.
టేప్ చెవులకు కట్టుకుందామా – వీడియో లైబ్రరీ కెళ్ళి త్రిబులెక్స్ తెచ్చుకుందామా
ఏమంటావ్ చెప్పు ఎనకముందులెందుకు ఎనకటోడివా – లక్షణాలు లెవ్వా
ధ్యానం చేస్కోపో అలసిపోయావా ఐతేరా
పెప్సియా లెహరా థమ్సప్పా కోకాకోలా ఏంకావాలో ఎంచుకో
హద్దులు తెంచుకో విసిరేయ్ గొంగళి పురుగు తనాన్ని
చించెయ్ గతకాలపు పాతని

భూతం హిప్నాటిస్టవుతుంది
ఇనపగోళ్ళ కాళ్ళతో తన్నుకపోతుంది
చౌరస్తా గోడమీద బార్లా సాపిన బ్రానో డ్రాయరో అవుతుంది
గుండెల్లో చివుక్కున దూరి రక్తంలో మంట పెడుతుంది
నరాల్లో కరంటవుతుంది
బ్రేక్ బ్రేక్ బ్రేక్ డాన్స్ డాన్స్ డాన్స్
ప్రభూ – దేవా ఈ లోకాన్ని కాపాడు

మైఖెల్ జాక్సనో – మడొన్నానో మాల్గాడి శుభో రెహమానో
బప్పీలహరో జడేజానో జాకీచాన్ టైసన్ ఎవరు కావాలో ఏరుకో
బ్లూలాగూనో – సిరాకోనో బేసిక్ ఇన్‌స్టింక్టో – బాండిట్‌క్వీనో
దేంట్లో తేలుతావో కోరుకో
మానసికానందోద్రిక్తతాందోళనా కెరటాలలో కొట్టుకుపోవటానికి
తన్మయత్వం పొందటానికి
ఓ భూతమా ఓరాక్షసమా విషపునవ్వుల సామ్రాజ్య వాదమా
విత్తనాల పేర ఎరువుల పేర మందుల పేర పేటెంట్ హక్కుల పేర
డంకెల్ డ్రాఫ్టువై విస్తరిస్తావు
భాష్యాలు చెబ్తావు బలే బలే వలలేస్తావు
శాస్త్రంలో సమాజంలో అంతరిక్షంలో అణుబాంబులో
పరకాయ ప్రవేశం చేస్తావు

మానవసంబంధాలను శిథిలశకలాలు చేస్తావు
నువ్వులేని  చోటుందా నువ్వు వేయని వేషముందా
మనిషిని వస్తువుచేసి డబ్బును చేసి ఊరేగుతున్న నీ ఉనికిని
నిలదీయటానికి సభ్యదేశాలు ముక్త కంఠంతో ప్రశ్నిస్తున్నాయ్
పథకం వేస్తున్నాయ్
బుష్‌క్లింటన్ బోరిస్ ఎలిత్సిన్‌ల పన్నాగాలను పసికడుతూనే ఉన్నాయ్
పంచరంగుల పంజరం నుంచి విముక్తిని నినదిస్తున్నాయి
ప్రపంచ కార్మికులారా ఏకం కండని గర్జిస్తున్నాయి
కుయుక్తి కుతంత్రాల నక్క జిత్తుల ఎత్తులకు
బుద్ధి చెప్పే రోజు కోసం వేచి చూస్తున్నాయ్



## తాకట్టు

– కె. రంగాచారి

అందంగా ఎగురుతున్న పక్షుల్ని
అమాంతంగా  వలవేసి పట్టి మాయం చేయడం
గోళ్ళలో గుండు సూదులు గుచ్చి
సున్నితమైన చెక్కిళ్ళను చెక్కిపారేయడం
చిత్రహింసలు పెట్టి లాకప్‌డెత్‌లు చేయడం
ఎన్‌కౌంటర్ చేయడం
ఇప్పుడు పాత పద్ధతైపోయింది
కట్టె విరగకుండా
పాము చావకుండా
కత్తికనబడకుండా
మీ అస్తిత్వాల్ని దోచుకోవడానికి
ఇప్పుడో కొత్త పద్ధతి ప్రవేశ పెడుతున్నాం
మిమ్మల్ని అణువణువునా హింసించడానికి
మా పోలీసుబలగాల చేతులు చాలడం లేదు
అందుకే ఇప్పుడు మిమ్మల్ని
ప్రపంచపోలీసు చేతుల్లో పెడుతున్నాం
రైతులారా!
ఇకమీరు నీళ్లగురించి అడగక్కరలేదు
అప్పుల్ని అడగక్కరలేదు
భూముల్ని అడగక్కరలేదు
ఎరువుల్నీ అడగక్కరలేదు
ఎందుకంటే?
విత్తుకోవడానికి మీ విత్తనాలుండవు గనక
మేధావులారా!
ఇక మీరూ ఆలోచించనక్కరలేదు

హక్కుల్నీ అడగక్కర లేదు
మీరేం ఆలోచించాలో మేమే నిర్ణయిస్తాం
ఎందుకంటే?
మీ మెదళ్ళపై పేటెంట్ హక్కుల్ని
ప్రపంచ పోలీసుకి రాసిచ్చాం
వ్యాధిగ్రస్తులారా!
మీకు గుండెపోటు వచ్చినా
జ్వరం వచ్చినా
చివరికి జలుబుచేసినా
ఇకమీరు చనిపోవాల్సిందే
ఎందుకంటే
మీకు అందుబాటులో ఏమందూ ఉండదు గనక
ఓ నా భారతదేశ ప్రజలారా!
మీరేం కొనాలో
ఏం అమ్మాలో
ఏం తినాలో
చివరికి ఏం మాట్లాడాలో మేమే నిర్దేశిస్తాం
ఎందుకంటే?
మీ దేహాల్ని ప్రపంచ పోలీసుకి
తాకట్టు పెట్టేశాం

(భారతదేశ అస్తిత్వాన్ని దోచుకుంటున్న 'గాట్' ఒప్పందం నేపథ్యంలో)



# దొంగలకి తాళం చెవులు

– పోగుల రాజన్న

వాడి ఆకలికి హద్దులేదు
దొంగ తిండి తినడానికి
వాడికి సిగ్గులేదు

"జన్నెకిడ్సినట్టు" ఊరుమీదపడి
దోచుకుందామనే వాడి ధ్యాస

దొంగలకి తాళం చెవులిచ్చిన
నాదేశమా సుఖీభవ!?

భూమిని చదును చేసి –
ఆరుగాలం శ్రమించి –
విత్తనం వాడి చేత నాటించాలని చూస్తున్నావు
రేపు పెరిగిన మొక్కెవరిదన్నదే వివాదం

రోకట్లో తలపెట్టి –
ఎందరి తలల్ని పగల దీయాలనుకుంటున్నావు!?

వాడు దేశదిమ్మరి
దేశ దేశాల నీళ్లు తాగి
వాడి కళ్లు పచ్చకామెర్లయ్యాయి
వాడి 'వెచ్చదనానికి'
మన భ్రమలకి రంగులద్ది
మనుషుల్ని గొర్రెల్ని చేసి
ప్రపంచ బ్యాంకు అప్పుల్తో
పచ్చగడ్డేసి ప్రేమ చూపుతున్నాడు
విశ్వాసం మరువలేని నా దేశమా!
నీవు దేనికైనా సిద్ధమేనా?
తాకట్టు పెట్టి పెట్టి

మా బ్రతుకుల్ని దాసోహం చేస్తున్నావ్ కదూ!?
మా రెక్కల్ని బోను ఊచలకి అంటగట్టి
నోళ్లని మూయించాలని చూస్తున్నావ్
ఆయాసం నుండే అరుపు మొదలైంది
బాధల్నుండే బ్రతకడం నేర్చుకున్నాం
మా కష్టఫలాల్ని దాచుకోడం కోసం
మీ సుఖాల్ని కాల్చేయడం కోసం
ఉట్టిమీద మా అన్నం మెతుకుల్ని
భద్రంగా కాపాడుకోవడానికి
మేం దేనికైనా సిద్ధమే అయ్యాం
నీవు శతృవు ఆడే
చదరంగం ఆటల్లో
మమ్మల్ని పావుల్ని చేస్తే
మేం ఎట్లా ఊర్కుంటాం!?
నోళ్లని జెండాల్ని చేసి
చేతుల్ని జొన్న కొయ్యల్ని చేసి
సామ్రాజ్యవాది ఒంటి బురదని దులపడానికి
మేం సన్నద్ధమవుతున్నాం



# వైరం

– అలాజ్‌పూర్ కిషన్

వైట్‌హౌస్ తెల్లగా ఉంటేచాలు వాడికి
ప్రపంచమంతా నల్లగా ఉంటే వాడికేమిటి?
పాపాలు కడిగే ఏసులున్నంత కాలం
పాపాలు కాక పుణ్యాలు ఎవరుచేస్తారు?
డాలర్ ఆయుష్షు పెరుగుతున్నంత కాలం
రూపాయి ఆయుష్షు తరుగుతూ ఉంటుంది
కడుపు నిండిన వాడికి
డాలర్‌తో వైరం అక్కరలేదు
రక్తం కూడు తినే వాడికి
మనిషితో సంబంధమక్కరలేదు
ప్రతి ఫైలికి ప్రజల నెత్తుటి పచ్చనోట్లు నంజుకునేవాడికి
సామ్రాజ్య వాదంతో వైరమక్కరలేదు
మనకన్నీళ్ళకు
ఏడాలరూ కరిగి రాదు
మన ఆకలి తీర్చేప్లాను
ఏ కంప్యూటరూ కనిపెట్టలేదు
రంగు రంగుల ప్రపంచం
రంగుల రాట్నమై మనచుట్టూ తిరుగుతుంటుంది
ఏ రంగులో విషం కలిసిందో
కంప్యూటర్‌కు తప్ప మనిషికి తెలియదు
మన మెదడును
ఎన్ని ఛానల్స్‌తో ఎన్ని ముక్కలు చేస్తుందో
వైట్‌హౌస్ చెప్పదు
ప్రేమ పచ్చిబూటకమై
డాలర్ ఒక్కటే మనిషికి దగ్గరవుతుంది

రెండు హృదయాల మధ్య
స్నేహానికి బదులు డాలర్ బంధం
పెరిగి పెరిగి డాలర్ ఉరిత్రాడయి
మెడ చుట్టూ బిగుసుకుంటుంది

భారత్ అమెరికాల రాపిడిలో
కొత్త మానవుడు ఉదయించలేడు
మన పొలాలు పచ్చబడలేవు
భారత్ అమెరికాల
అక్రమ సంబంధంలో
ఇద్దరు వింత వికృత మనుషులు జనించారు
ఒకడు పి.వి. మరొకడు మన్మోహన్
డాలర్‌కు అమ్ముడుపోయి
మననోట్లో ఊపిరాడకుండా
ఎందుకూ పనికిరాని రూపాయిని కుక్కారు
ఇది మనిషిని చావనివ్వదు - బతకనివ్వదు
ఆకలితో చచ్చిన శవానికి
కంప్యూటర్ వేదంతో కర్మకాండ చేసి
ఆత్మశాంతి చేద్దాం రండి!



# ఖాయం

– ఐలేని గిరి

దేశాన్ని ఏలుకోడానికి రాబందుల్ని ఎన్నుకున్న క్షణం నుంచీ
మన ప్రమేయం శూన్యమౌతుంది
రైల్వేలైన్లు, నీటి ప్రాజెక్టులు, విద్యుత్సరఫరా, బస్సు సౌకర్యం
రిజర్వేషన్లూ, వుద్యోగాలు, ఉచితభోజన పథకాలూ ఒకటేమిటి
నోటికొచ్చిన బాణాన్ని సంధించి ఓట్లు రాల్చుకుంటూ వాళ్ళూ -
క్షణికానందపు ఊహల్లో మరోసారి
స్వర్గసీమల్ని, రామరాజ్యాన్ని ఊహిచుకుంటూ మనం -
ఎన్నుకున్న క్షణం నుంచీ రాబందుల వేట మొదలౌతుంది
ఏ పథకానికి కన్నం వేయాలి
ఏ కాంట్రాక్టు మంజూరు చేస్తే ఎంత లాభం?
ఏ కాంట్రాక్టు పనుల్లో దళారీ నక్కతో వాటా కుదురుతుంది
రెండుకోతుల మధ్య రొట్టె ముక్క బడ్జెట్‌తో
ఆరంభమైన అభివృద్ధి పనులు అర్థాంతరంగా ఆగిపోతాయి
ప్రజాస్వామ్య పిండారీలు కుంభాకారంగా బలిసి
అనేక కోణాల్లో దేశాన్ని కొల్ల గొడతారు
అంతా చేసి అమాయకంగా
ఆర్థిక పరిస్థితి అధ్వాన్నంగా ఉందని
జుట్టు, గడ్డం పీక్కుంటారు
మొండి చేతుల దేశం ప్రపంచపటంలో దీనంగా నిలబడుతుంది
వేలకోట్ల అప్పుల్తో అన్ని ఆంక్షల్ని అంగీకరించి
స్వర్గ సీమల్ని డంకెల్ జేబులో పెట్టిన మూడు ముఖాల సింహం
విరిగిన దేశం వెన్నుముకని నిమురుతుంది
అటు రాజకీయ భూతాల పళ్ళు తోమీ తోమీ
పరిశ్రమలూ బ్యాంకులూ సుష్ఠీచేసి మంచమెక్కుతాయి
పాలకదెయ్యం ప్రైవేటీకరణ మంత్రాన్ని పఠిస్తుంది
విదేశీ రాక్షసి కళ్ళు తెరిచేది అప్పుడే

సామ్రాజ్యవాదం సకిలించేదీ అప్పుడే
కొలాబరేషన్ పేరుతో దేశం విదేశీయమైతుంది
ప్రైవేటు చానల్సుతో టీవీ పెరుగుతుంది
షర్టూ ప్యాంటూ, ఫర్నిచర్ రెడీమేడ్ తినుబండారాలు
ఒకటేమిటి ప్రసార సాధనాల్లో ప్రకటనలు పరాకాష్టకు చేరతాయి
కుటీర పరిశ్రమలూ చేతి వృత్తులూ
గోడకు వేలాడ దీసిన చిత్ర పటాలౌతాయి
కొనుగోళ్ళు పెంచే క్రమంలో వుత్పత్తి దారులూ
వస్తువులేకపోతే బ్రతుకే నిరర్థకమన్న భ్రమతో మనం
నేలమీద ఆరోగ్యంగా బతికే పక్షికి
నింగిలో విహరించాలన్న ఆశ
చాలీచాలని జీతంతో బతికే చెట్టు చుట్టూ
రంగుల కలలు మొలుస్తాయి
కృత్రిమ సంస్కృతుల విషాహారం తిని
మనిషితో పాటు మనీ పర్సూ కళ్ళు తేలేస్తుంది
సామ్రాజ్యవాదం వేళ్ళూనుతూ దేశాన్ని కబళించే
తంత్రం సఫలమవుతుంది
అభివృద్ధి చెందుతున్న భ్రమతో ఉప్పుల ఊబిలోకి
అడుగులు దిగుతుంటాయి
మెడలోతు దిగే సరికి ఎదురుగా సామ్రాజ్యవాద భూతం
ఎదురీదే చేవావుండదు - ఎదిరించే హక్కూవుండదు
అడుగుల్లోకి మేకులు దించి అరదండాలు మరమనిషిని ఆడిస్తాయి
తస్మాత్ జాగ్రత్త!
ప్రభుత్వం సాక్షిగా భస్మాసుర హస్తం లేస్తోంది
ఫ్యాన్సీ ప్రపంచంలోంచి కళ్ళు తెరవకపోతే
మరోసారి సామ్రాజ్యవాద భూతం కబళించడం ఖాయం
రాబందుల్నెదిరించే చేతులు మొలవకపోతే
రాబోయే సంకెళ్ళూ ఖాయం
బానిస బతుకులూ ఖాయం